(రే?)(గాముపేరిటి రెంటెము గట్టి
భోగిపేరితీగాకు పొసఁగఁ జుట్టుచును
బాగుగాఁ జుక్కపేరి యాభరణాలు వెట్టి
నాగముపేరిటి నాతి నిన్నుఁ బిలిచె ॥ గాలి ॥

సురపతిపేరిట్టి(టి?)సరులు ధరించి
శిరుల మౌనిపేరి జీవముఁ బట్టి
పొరి నీటిపేరిపాన్పున శ్రీవెంకటనాథ
విరిమీఁదిబిడ్డపేరి వెలఁది నిన్నుఁ గూడె. ॥ గాలి ॥ 117

చి. శృ. 20 రే. 5 పా. రామక్రియ

చెప్పకురే వానిసుద్ది చెలులాల
వొప్పులు సేసిన తనవోజలు మానీనా ॥ పల్లవి ॥

తా నేపూరు నే నేపూరు తల మనవే చాలు
మానరాని వావు లేల మాకుఁ జెప్పీని
మోనాన నూరకుండరే మొన్నటివాఁడు గాఁడా
వూని గరివడ్డగింజ వుడుకఁ బోయ్యీనా ॥ చెప్ప ॥

యెక్కడి కెక్కడిపొందు లేలా మొక్కులు మొక్కి
దక్కినట్టి దాస లెల్లఁ దలపించీని
తక్కరించె నిన్నటి తగవరి తానె కాఁడా
మక్కువైనా చిలుక మానీనా గుణము ॥ చెప్ప ॥

యెంత కెంత మందెమేళ మిట్టె సంగడి నుండి
కాంతుఁడు న న్నేమిటికిఁ గాఁగిలించీనె
వింత లేక నన్నును శ్రీవెంకటనాథుఁడు గూడె
యెంత సేసినాఁ జక్కెర యేల తీపు మానును. ॥ చెప్ప ॥ 118

చి. శృ. 20 రే. 6 పా. సాళంగనాట

అందు కేమి దోసమా అయితే నేమి
కందు వై లోకములోనఁ గలదే కాదా ॥ పల్లవి ॥

వలచి యిందిరాదేవి వన్నెలుఁ జిక్కుఁదనాలు
లఁపులో నేపొద్దూఁ దలపోయఁగా
సలిగెతోడుత నాపె సారూప్య మందినట్టు
వలు వై గోవిందుఁడే నారాయణి యాయను ॥ అందు ॥

బాలకి యై లకిమమ్మ పై పై శిగ్గువడఁగా
తేలించి యాపె మనసు తెలియఁ బూని
చాలా వేడుక నాకె సకియై యుండినటు
ఆలికిఁ గా భువనమోహనరూప యాయను ॥ అందు ॥

యెదయ కింతులలో మే లెల్లాఁ దెలియఁ బూని
కదఁగి యాఁడురూపము గైకొని చూచి
బడినె తనకు నెందూఁ బతిలేనివాఁడు గాన
కద గోవిందుఁడే శ్రీవెంకటనాథుఁ డాయను. ॥ అందు ॥ 119



## సూచిక ౧

## సంకీర్తన అకారాది సూచిక

## సంకీర్తనల రాగముల అకారాది సూచిక

| రాగము | సంకీర్తన సంఖ్య. |
|---|---|
| లలిత | .... 84. |
| వరాళి | .... 1, 35, 41, 46, 47, 51, 69, 91, 105. |
| శంకరాభరణం | .... 7, 17, 28, 31, 37, 40, 43, 61, 65, 115. |
| శ్రీరాగం | ... 8, 42, 90, 112. |
| శుద్ధదేశి | .... 77, 93. |
| సామంతం | .... 3, 30, 45, 63, 75, 99, 104. |
| సాళంగనాట | .... 22, 27, 38, 98, 113, 119. |
| హిందోళం | .... 87. |
| హిజ్జిజి | .... 9, 15. |



## సూచిక 3

### సంకీర్తన తాళముల అకారాది సూచిక

| తాళము | సంకీర్తన | రాగము | సంకీర్తనసంఖ్య. |
|---|---|---|---|
| అటతాళము | కాదని వేగిరించితే .... | పాడి .... | 53 |
| అటతాళము | తలఁపుఁ దలఁపు .... | రామక్రియ ... | 102 |
| ఏకతాళము | తేటతెల్లమిమాఁటలు .... | ముఖారి .... | 79 |
| వర్మ్రతాళము | ఇంక నేలా నాతోడ ... | బౌళి .... | 100 |

